క॥ నెల దాఁటుదాఁక యవనులఁ గలనఁ గలఁచి నృపగురుండు ♦ కాపురముఁ దగన్
దలఁగించి బోయపల్లియ నిలిపి పదిలపఱచి మఱల ♦ నెక్కెను ననికిన్. 19

మ॥ పరమప్రీతిని భిల్లలోకపతి యా ♦ పాళేశ్వరీ పాదపం
కరుహద్వంద్వముఁ గొల్చి తోడుకొని యా ♦ 'కావా' ఖనిన్ జేర్చె; నా
కరుణాసాంద్రమనస్క యత్తఱిని భూ ♦ గర్భమ్మునన్ జేరు నా
ధరణీనందనమాడ్కిఁ బెం పెసఁగె నా ♦ దార్యంబు దీపింపఁగన్. 20

గీ॥ రాణివాసంబు భిల్లరా ♦ ష్ట్రంబుఁ జేరుటెఱిఁగి మహబతుఖాన్ సేన ♦ నురవడిమెయి
దఱిమె; దుర్గమవనముల ♦ నరుగలేక గరళమ్మున్ దిన్న వేఁదుఱు ♦ గతిఁ గలంగె. 21

గీ॥ విచ్చె మొగిళులు; గగనంబు ♦ విమలమయ్యెఁ; గాపురముతోడ ననుచర ♦ గణముతోడఁ
గదలి బోయగూడెము వీడి ♦ కైలవార సీమలకుఁ జేరె వీరల ♦ క్ష్మీప్రభుండు. 22

గీ॥ విడిదిమార్పులు, పరగ రా ♦ యిడుములకూర్పు, లాత్మబలము తగ్గఁడునూర్పు, ♦ లలజడిఁ గొనఁ
దొడరి, తలఁకును మగటిమి ♦ ప్రోపులాడ వెనుకచూడక నృపుఁడు ము ♦ న్కొనిపెనంగె.

గీ॥ ఒక్కమెయి రేయుఁబవలును ♦ గ్రుక్కఁగొనక జయము దవ్వైనఁ గొలఁది ను ♦ త్సాహశక్తి
రవులుకొల్పుచు నడిపెసం ♦ గ్రామదీక్ష, విమతులకుఁ జిక్కఁగడమ దు ♦ ర్గములుగూడ.

సీ॥ మిట్ట మధ్యాహ్నంబు! ♦ మిహిరుఁ డుగ్రుండయి చెలరేఁగె; నొకచోటఁ ♦ జెట్టునీడ
బోయ గడ్డిని దెచ్చి ♦ యీయఁ బాళేశ్వరి రుబ్బి కాల్చుచునుండె ♦ రొట్టెములను;
బిడుగుపాటున వచ్చి ♦ పడియె నంబరుదిక్కునుండి ఫరీద్ఖాను ♦ దండుఁ గొనుచు;
మనుజేశ్వరుండు కొ ♦ మ్మలు వంచి బుట్టల, బిడ్డల భార్యను ♦ బెట్టి విడిచెఁ;
గీ॥ ననుచరులఁగూడి యవనసై ♦ న్యంబుఁ దాఁకి పసులనూఱులుగాఁ దలల్ ♦ చిదిమివైచె;
నంత భిల్లులు వనసీమ ♦ నాక్రమించి పిల్లలను రాణిఁ జేర్చిరి ♦ భిల్లవాటి. 25

సీ॥ షాబాజుఖాన్ గొప్ప ♦ సైన్యంబు తన వెంటఁ గొలువంగ లోయలో ♦ పలికిఁ జొచ్చె;
శైలసాంకేతిక ♦ సాహాయ్య మూఁది ప్రతాపుఁడు భటులఁ గొం ♦ దఱను గూర్చి
యాకస్మికమ్ముగా ♦ నరిసేనపై మారి మసఁగినగతిఁ గ్రమ్మి ♦ మట్టుసాఁగె;
నీయవస్థను ఖానుఁ ♦ డెఱిఁగి సైన్యము వెన్కమొగమయి పరవఁగా ♦ ముదల వెట్టెఁ;
గీ॥ దురకభటు లల్ల నల్లన ♦ మరలిచూచి రాజమణిఁ గానమికి నబ్బు ♦ రమ్ము పడిరి!
యాతఁ డవ్వలిదెస లోయ ♦ నరిబలమ్ము బిట్టు దట్టించెఁ గ్రుక్కఁద్రి ♦ ప్పికొననీక. 26

మ॥ మఱలన్ వైరులు వెన్కకున్ దిరిగి; రీ ♦ మాఱున్ బ్రతాపావనీ
శ్వరుఁ డవ్వారికిఁ గానరాక యెటనో ♦ శైలంబు లందుండి ముం

దటిఁ బోఁగొట్టిన శత్రుసేనలఁ బ్రచం ♦ డస్ఫూర్తిమైఁ దాఁకి కొం
దఱి నాత్మీయకృపాణధారలను భ్రమం ♦ దర్పించెను సత్యుగ్రుఁడై. 27

క॥ "కనఁబడఁ డెట్టులు వెదకినఁ; గనఁబడినను బట్టుపడఁడు; ♦ కట్టా! యింక నే
మొనరింతు" ననుచు, ఖానుఁడు తనసేనను గొనుచు గిరులు ♦ దాఁటుకొని చనెన్. 28

క॥ ఖాసింఖాను మహాసేనా సంవృతుఁడగుచు నవలి ♦ నాఁ డరుదేరన్
గా, నడి గని యాతని నిట్టి సెలుగులఁ బెట్టి యినకు ♦ లేంద్రుఁడు కలఁచెన్. 29

క॥ అటుపిమ్మట గనుమలనిటఁ బోయి మటియును బైఁబడుట చీలు ♦ చుట కలఁచుటయున్,
విటతాటనమ్ము చేయుట ప్రేటేలోఁ జాటుగుట నృపతి ♦ ధూర్జటి నేర్చెన్. 30

క॥ పులి నివసింపను గుహాలోపలి కరిగను వారణవితతి ♦ వలె, యావన వీ
థులు దాఁగ దినదినము నంచెలుగఁ బ్రతాపుఁడు కలఁచి ♦ తనువులు సించెన్. 31

గీ॥ అవిసిలొంజాన్యములతోడ నేఁగి ♦ సన్నిహోత్రమున, నలుంబ్రాధిపతి శాత్ర ♦ వాటవి నటు
భస్మ మొనరించె. నిటు ప్రతా ♦ పప్రభుఁడు వనర సమరాభ్రసీమ మా ♦ ర్తాండుపగిది.

క॥ ఒకపాలు సైన్యములు కొంపెకనుమను బ్రతాపుఁదాఁకి ♦ నలిసేయుచు వే
ఱొకపాలు భిల్లదేశము నికటముననఁ జరించె రాణి ♦ నిల్ వెలుఁబట్టన్. 33

క॥ "మ్లేచ్ఛకము లెవిరించిన మ్లేచ్ఛను మోవనీక ♦ పూనికమొయి నా
భిల్లులఁ గెలఁచెద" నని యొప్పుల్లొఖా నేన సైన్య ♦ ములఁ దోడ్కొనుచున్. 34

ఆ॥ కలహమునకును ♦ 'జప్పురా' తెగరపు గనులలోన రాణి ♦ గారి నుంచి
వేయుఁగనులతోడ ♦ వేయుఁజేతులతోడఁ బ్రీతిఁ గాచుచుండె ♦ భీమచాంద. 35

క॥ అనుచరుఁ డొకదిన ముదయంబునఁ దగరపుగనులు చేరఁ ♦ బోయి మహారా
ణిని గాంచి భక్తిఁ దెచ్చిన వనజములకు మ్రొక్కి నిలువఁ ♦ బాణేశ్వరియున్, 36

—*) ప్రాణేశ్వరిదేవి భిల్లునితోడను భర్తనుగూర్చి యడుగుట. (*—

మ॥ "దినపతి సోజ్జ్వల కాంతి కాంతమయి, యు ♦ ద్యత్పద్మపత్రాభ సుం
దర నేత్రద్వయమై, పరాక్రమనిధా ♦ ధౌరేయమై, సత్కృపా
భరితంబై, రమణీయమై, భువన సే ♦ వ్యంబైన, నా జీవితే
శ్వరు నెమ్మోమును గాంచి నేఁటికొకనా ♦ సం బయ్యె భిల్లాగ్రణీ! 37

క॥ వైరులసైన్యము లెంత యపారముగాఁ జుట్టుకొనెనో! ♦ వారేయెడ ను
న్నారో! సమయమునకు నాహారము దొరకెడునో! మాకు ♦ నై వగతు రోకో! 38

మ॥ అకటా! వైరులదాడి తగ్గదని వా ♦ రాయాసమున్ జెందఁబో
రు కదా! యెప్పటియట్ల నవ్వుచునె పో ♦ రున్ దీర్తురా! రాజపు
త్రకు లుత్సాహము వీడరే కద! సలుం ♦ బ్రాభర్త సర్వాంగర
క్షకుఁడై భక్తి యెలర్పఁ బ్రాణవిభు ప ♦ జ్జన్ గొల్చి యుండున్ గదా! 39

సీ॥ శ్యామసింహుండు పా ♦ ర్శ్వమున వర్తించునే! సామంతు లందఱు ♦ సరస నుండ్రె!
స్వాతంత్ర్యసమరదీ ♦ క్షామహోపన్యాసములు తొంటిచందాన ♦ నొలుకుచున్నె!
వ్యాకోచ పుష్పంబు ♦ వలె నాథుమోమున నానంద దరహాస ♦ మలరుచున్నె!
నాయాస మెప్పుడే ♦ నంది కుందఁరుగదా! యారోగ్య సౌభాగ్య ♦ మనువగుఁగద!
గీ॥ యూర్జితోత్సాహకళలతో ♦ నొప్పెడుఁగద! తఱమ బిడ్డలదెస మది ♦ మఱలదు గద!
విమతులకునెల్ల గర్భని ♦ ర్భేదకముగఁ దీవ్రకరవాలధార న ♦ ర్తించెడుఁగద! 40

మ॥ “ప్రమదం బొప్ప రణాంగణంబులఁ బ్రతా ♦ పస్వామి స్వాతంత్ర్యయో
గము సాగింపఁ దదాత్మజాతుఁడు భుజా ♦ గర్వంబుఁ బోనాడి దూ
రమునం డాఁగెడు నెట్లు! వైరులతలల్ ♦ రాల్పంగ నన్నాజ్ఞ సే
యు”మటం చెప్పుడుఁ బోరు నియ్యమరసిం ♦ హున్ బట్టనేరన్ గదా! 41

మ॥ చుఱకత్తుల్ గొని చెట్లపై కుఱికి “ప్రము ♦ చ్చుల్ వోలె మామాతృదే
శరమున్ గొల్లలుగొట్టు నీయవనులన్ ♦ శాసింతు మి”ట్లంచుఁ జిం
దరగాఁ జీల్చెద రీయకుంగు నిసువుల్ ♦ నాకన్నసంతాన; మే
కరణిన్ దండ్రికి దప్పుగా నిలుప శ ♦ క్యం బౌను నాబోఁటికిన్! 42

ఆ॥ విశ్వ మెల్లఁ బొగడ ♦ బిల్లరాజ్యం బేలు సత్ప్రభుండు భీమ ♦ చాందు దొరయుఁ
దండ్రివోలెఁ గాచుఁ; ♦ దత్కృప మముఁ జీమ సోఁక; బెట్టి కొఱఁత ♦ మాకు లేను.

క॥ కాని ప్రతాపధరిత్రీజాని పదాబ్జాత దివ్య ♦ సందర్శన సే
వానంద మందఁగోరుచు మానస మొక్కింత వంత ♦ మరఁగి కరఁగెడున్. 44

క॥ ఒకమాఱు దర్శనము చేసికొనన్ వలె నంటినని వ ♦ చింపు” మనఁగఁ గం
చుకి పాటేశ్వరి పాదములకు మ్రొక్కుచు వెడలి వనము ♦ లన్ బడిపోయెన్. 45

గీ॥ అవల నొక్కనాఁడు ప్రతాపుఁ ♦ డరుగుదెంచె; బోయదొర స్వాగతంబిచ్చి ♦ పూజచేసె;
బిల్లలను భార్యఁగూడి పృ ♦ థ్వీవిభుఁడు కతిపయదినంబు లచ్చోటఁ ♦ గడపె వేడ్క. 46

ఉ॥ అంతట నొక్కనాఁడు శబ ♦ రాలియమున్ విడి యాప్రతాపభూ
కాంతుఁడు వీరయోధులును ♦ గాంతయు బిడ్డలు వెంటరా, నహా

ర్యాంతరసీమలం దరిగి ♦ యచ్చట మొగలుసేనఁ జూచి క
ల్పాంతకుఁడట్లు దాఁకి సమ ♦ రావనిఁ బెక్కురఁ ద్రుంచె నుగ్రుఁడై. 47

సమరము ముగిసిన సాయంసమయమునకు శైలసీమఁ ♦ జల్లని వటవృ
క్షముక్రింద వసించెఁ బ్రతాపమహీంద్రుం డచట నా వి ♦ భావరిఁ గడపఁగ. 48

ఆరాత్రికొంత కడచనఁ దారాపథమందు నిబిడ ♦ ధారాధరముల్
ధారాపాత్రలకరణి నపారమ్ముగ రేఁగి ఘోర ♦ వర్షము గురిసెఁ. 49

మాటిమాటికి హెచ్చె దె ♦ బ్బాటువాన; వర్షమువకన్న రేఁగె బ్ర ♦ భంజనంబు;
నిలువ నెలవైన తరు వట్టె♦కలయనూఁగి తల నొఱగునో యనెడి శంక♦దన్రులఁజేసె. 50

చలికి గాలి కాఁకలికి వ ♦ ర్షమున కడలి బిడ్డ లేడ్వ సాఁగిరి; కట్టు ♦ గుడ్డ లెల్లఁ
దడిసె; నిసుఁగులు తనచుట్టు ♦ వడకుచుండ తెప్ప వాల్పక రాణి యా♦రేయి గడపె. 51

తెలతెలవాఱె; వా ♦ నల పోటు తగ్గె; రాజ్ఞియు గడ్డిరొట్టెలు; ♦ చేయుచుండె;
ఖాసిముఖాను చెం ♦ గటఁ దోఁచె, సపరివారుండయి రాజగు ♦ రుండు తొలఁగి
యొకగుహా చేరి కూ ♦ ర్చుండె; నంతట మహాబత్ఖాను గనఁబడెఁ; ♦ బ్రభుఁడు చెంత
శైలశిఖర మెక్కె; ♦ షాబాజుఖాఁ గొంతసేపటి కచ్చోటు ♦ చేర వచ్చె;
నృపవరుఁడు లోయ కరిగె; ఫ ♦ రీదుఖానుఁ డచటి కేతెంచె; భూపతి ♦ యద్రి దాఁటె;
నచటి కరిగె నబ్దుల్లాయు; ♦ నవనిపతియు నేగఁదొరకొనె 'నాబూ' గి♦రీంద్రమునకు. 52

సీ॥ ఉదయపురమునకు ♦ నుత్తరమ్మున రెండుక్రోసులపైనఁ ద్రి ♦ కూట మనఁగఁ
బర్వతం బలరు; నా ♦ వసుధాధరము చుట్టు నతిసాంద్రమగు నర ♦ ణ్యాంబు దనరు;
నీర మెల్లెడ నూట ♦ యూరి బుగ్గలుపుట్టి ధ్వను లెత్తి సెలయేళ్లు ♦ పాఱుచుండుఁ;
ద్రివిధ శీతోష్ణప్ర ♦ దేశంబు లందుండు సకలజాతుల వృక్ష ♦ సమితి యలరు;

---

Within its impervious recess es rose the three-peaked (Tricuta) mountain at whose base was the town of Nagindra, the abode of brahmins, who performed the rites of the great God. The most antique temples are to be seen in these spots, within the dark gorge of the mountain, or on its rugged summit in the depths of the forest and at the sources of the streams, where sites of seclusion, beauty and sublimity alternately exalt the mind's devotion. In these regions the creative power seems to have been the earliest and at one time the sole object of adoration, whose symbols, the serpent-wreathed Phallus [Lingam] and its companion, the bull, were held sacred even by the children of the forest.

" Annals of Mewar. '

గీ॥ మొల్లలును జాజి గన్నేరు ♦ మల్లెచెట్లు పారిజాత మందార చం ♦ పక తరువులు
కసరుఁబూల గుబాళించు ♦ కమ్మతావి విరియ వెదచల్లు దెస లెల్ల ♦ వెల్లిగొనఁగ. 53

§ గీ॥ అతి నిబిడమైన గహనమ ♦ ధ్యమున, సూర్యరశ్మి సోఁకని శైలగ ♦ ర్భముల, నదులు
మొలుచు తావులభవునికో ♦ వెలలు వెలయు గగనమునఁగూరిపోయుచు ♦ కట్టలవిధాన.

గీ॥ అనుచరసమూహములు వెంట ♦ నంటి కొలువఁ బ్రకృతిరమణీయమగు నీయ ♦ రణ్యసీమఁ
దాఁటి భూధర మెక్కి ప్ర ♦ తాపదేవుఁ డరిగె నప్డు డాబూపర్వ ♦ తాగ్రమునకు. 55

—*) ఏకలింగేశ్వరు నాలయ వర్ణనము. (*—

క॥ పున్నమ సన్నని వెన్నెల మున్నీటను దేలు దొడ్డ ♦ పూమొగ్గటు ల
§ త్యున్నత సిత గోపుర సంపన్నంబగు నేకలింగ ♦ పతి దేవళముఁ. 56

---

In these silent retreats Mahadeva continued to rule triumphant. The temple of Eklinga, situated in one of the narrow defiles leading to the capital is an immense structure, though more stupenduous than elegant. It is built entirely of white marble most elaborately carved and embellished, but lying in the route of a bigotted foe, it has undergone many dilapidations. The brazen bull placed under his own dome, facing the sanctuary of the Phallus is nearly of the natural size in a recumbent posture. It is cast (hollow) of good shape highly polished. and without flaw except where the hammer of the Tartar had opened a passage in the hollow flank in search of treasure.

"Annals of Mewar"

§ The shrine of Eklinga is situated in a defile about six miles north of Udaipur. The hills towering around it on all sides are of the primitive formation and their scarped summits are clustered with honey combs. There are abundant small springs of water which keep verdant, numerous shrubs, the flowers of which are acceptable to the deity especially the Kiner or Oleander, which grows in great laxuriance on the Aravullis. Groves of Bamboo and Mangoe were formerly common according to tradition. There are however still many trees sacred to the deity scattered around. It would be difficult to convey a just idea of a temple so complicated in its details. It is of the form commonly styled pagoda, and like all the ancient temples of Siva, its sikra, or pinnacle is pyramidal. The various orders of Hindu sacred architecture are distinguished by the form of the sikra, which is the portion springing from and surmounting the perpendicular walls of the body of the temple. The sikra of those of Siva is invariably pyramidal and its sides vary with the base whether square or oblong. The apex is crowned with an ornamental figure as a sphynx, an urn, a ball, or a lion, which is called the Kullus.

"Religious establishments."

గీ॥ తళుకుఁ బటికంపు శిలలు గో♦డలును గోపురములు ప్రాకారములు నాల♦యములుగలిగి
దేవళం బెల్ల ధవళకాం♦తిప్రశస్తిఁ బాలసంద్రంబు చందానఁ ♦ బరిఢవిల్లు. 57

క॥ మురువగు చెవులును, మెఱసెడి గొరిజలు, బెడగారు కనులు ♦ కొమ్ములు, ననుపౌ
శిరమున నిక్కుపు వృషభము పరిమాణం బొంది నంది ♦ వఱలుచు నుండున్. 58

గీ॥ నందికేశ్వరు దరిఁజేరి ♦ వందనములు చేసి గర్భాలయముఁ బ్రవే♦శించి పన్న
❁ గేంద్ర పరివేష్టితైకలిం♦గేశ్వరునకుఁ బూర్ణభక్తిఁ బ్రతాపుఁడు ♦ పూజ చేసె. 59

గీ॥ అందఱునుగూడి వచ్చి గ♦ర్భాలయమ్ము సరస నొకమండపమున వి♦స్తార వేది
కాంతరమ్మునఁ గూర్చుండి; ♦ రఖలసైన్య నాయకులఁగాంచి రాజనా♦రాయణుండు, 60

—*) ప్రతాపసింహుఁడు దేశత్యాగముఁ జేయుచునని యనుచరులకుఁ దెలుపుట (*—

గీ॥ "భరతఖండంబు నెపుడు ముం♦పంగ వచ్చు యవనసైన్య ప్రవాహమ్ము ♦ నడ్డగించి,
పర్వతమువోలె నిలిచి మే♦వాడలక్ష్మి శాశ్వతమ్ముగ విజయంబు ♦ సంతరించె. 61

సీ॥ భానువంశము వైభ♦వప్రాభవంబులు తిరమొనర్చెను శిలా♦దిత్యనృపతి;
సత్యసంస్థాపనా♦చార్యుఁడై రాజమండనుఁడయ్యెఁ గనకసే♦న ప్రభుండు;
నీలాబ్ధినుండి కా♦బూలుదాఁకఁ దురుష్క-పతులనెల్ల జయించె ♦ బప్పరావు;
వసుధాతలంబెల్ల ♦ వడవడ వడకించెఁ బురుషసింహుఁడు కాల♦భోజరాజు;

గీ॥ మఱియుఁ గోమనసింహాది ♦ మనుజపతులు సకల దిగ్దేశ విశ్రాంత ♦ సాంద్రయశులు;
ప్రాణములు మాతృభూమి క♦ర్పణముచేసి భారతోద్ధారకఖ్యాతిఁ ♦ బడసి చనిరి. 62

సీ॥ భరతఖండము నభో♦భాగ మార్తాండుండు! రాజపుత్ర కులైక ♦ రాజరత్న!
మాపృథాదేవి హృ♦దబ్జ మేలెడు దినస్వామి! పృథ్వీసార్వ♦భౌము బావ!
మేవాడరాజ్య ల♦క్ష్మీప్రాణనాథుండు! కల్యాణసింహునిఁ ♦ గన్నతండ్రి!
కగ్గార్ సకి రణాం♦గణ వార్ధి బడబాగ్ని! ఘోరీమహమ్మదు ♦ కుంజర హరి!

గీ॥ వసుధ వ్యాపించు యావన♦ప్రళయ ముడుప నవతరించిన యాదినా♦రాయణుండు!
సమరసింహక్ష్మానాథు ♦ సదృశులైన ప్రభువు లుందురె! యెన్ని క♦ల్పములనైన. 63

---

❁ The serpent "subtlest beast of all the field" worshipped as the emblem of wisdom (Budha) was enjoined with the symbol of the creative power, as at the shrine of Eklinga, where the brazen serpent is wreathed round the lingam.

"Festivals and Customs of Mewar."

సీ॥ రఘుపతిసింహు శౌ ♦ ర్యం బెంతనఁగవచ్చు! మాహామీరుఁడు నృప ♦ మాత్రుఁడగునె!
లఘురాజు దేశమే ♦ లాగు వృద్ధియొనర్చెఁ! జండుఁబోల్ ధర్మవి ♦ రుండు గలఁడె!
కుంభేంద్రుఁ గని రణ ♦ క్షోణి నెవ్వఁడు నిల్చుఁ! బృథ్వీశు సాహసం ♦ బెవరు కొత్రు!
సంగ్రామ శౌర్యదీ ♦ క్షారతి యెట్టిది! రత్నసింహుని పరా ♦ క్రమ మలఁతియె!
గీ॥ భానుకులమునఁగాక వి ♦ శ్వప్రపంచ మందు నేవంశమున జన్మ ♦ మొందినార!
లిట్టి భువనైకవంద్యులా ♦ పృథుబలాఢ్యు లిట్టి ధర్మసంస్థాపకు ♦ లిట్టి ఘనులు!
సీ॥ చూడనొప్పెయుండు ♦ నేడుకోటలతో! మహాబ్ధిఁబోల్ సప్తఖే ♦ యములతోడ!
నభ్రంబు సోఁకు జ ♦ య స్తంభతతులతోఁ! గలువపూలట్టి కో ♦ నెలలతోడ!
వెలయు నెన్బదినాల్గు ♦ విపణిమార్గములతో! సముదార రాజమా ♦ ర్గములతోడ!
సంఖ్యకు మీఱు ప్రా ♦ సాదసంతతులతో! జలపూర్ణబహుసర ♦ స్సమితితోడఁ!
గీ॥ బెక్కులక్షల జనులతో! ♦ వేలయేండ్లు యవనులకు గుండెగాలమై, ♦ రవికులంబు
గుత్తగొను క్షేత్రరాజమై, ♦ కొమరుమిగులు చిత్తురునుబోలు నగర మీ ♦ క్షితినిగలదె!
గీ॥ మహితమేవాడరాజ్యర ♦ మాసమగ్ర విభవభాగ్యముల్ చూడ్కికి ♦ ప్రేఁగుగొలుప
వాహినులఁగొంచుఁ బెక్కు సం ♦ వత్సరములు మొగలుపతి "యలాయుద్దీను" ♦ ముట్టడించె.
గీ॥ ప్రేటుఁదీఱె యొకింత దె ♦ ప్పిఱకమున్న ఘూర్జరమునుండి 'బహదూరు' ♦ క్రూరుఁడగుచుఁ
బచ్చి విసమును గ్రక్కుచు ♦ వచ్చి లగ్గ పట్టెఁ; జిత్తూరుపురలక్ష్మి ♦ కుట్టు వట్టె. 67
సీ॥ వైరివిశ్వంభరా ♦ పతి మర్మకీలంబు! యవనభూపాల కా ♦ రాలయంబు!
భాగ్యలక్ష్మి వసించు ♦ పద్మాకరవరంబు! సౌభాగ్య వైభవా ♦ స్థానవాటి!
రవివంశనృప మహా ♦ ప్రాసాదరాజంబు! రాజపుత్రుల మంది ♦ రప్రవరము!
భారతఖండాభ్ర ♦ తారావతంసంబు! భువనశౌర్యమునకుఁ ♦ బుట్టినిల్లు!
గీ॥ లలిత మేవాడలక్ష్మి వి ♦ లాసతిలకము సహస్రాబ్దములనుండి ♦ యశముఁ గనిన
పురవరేణ్యంబుఁ జిత్తూరుఁ ♦ బూదిఁగలిపె; దండుగొనివచ్చి యక్బరు ♦ దండధరుఁడు. 68
సీ॥ రాజసేవితము సూ ♦ ర్యద్వారరాజంబు వ్రీలి ముక్కలుగాఁగ ♦ నేల రాలెఁ;
దశ శిఖరము మాళ్వ ♦ మున దోఁచు కుంభజయ స్తంభ మూఁగాడి ♦ యవని మొగ్గె;
హారతుల్ వేదమం ♦ త్రారావముల నొప్పు కోవెల లన్నియుఁ ♦ గూలిపోయె;
వీరసునారు లు ♦ ర్విని బాసి పోవుట భవ్యమందిరములు ♦ పాడు వడియె;
గీ॥ నఱచుఁ జెవి దిమ్ముపట్టఁగా ♦ నక్షవిరిళ్ళు; బలిసి యెల్లెడ ముండ్లచె ♦ ట్లలము కొనియె;
విడక బుసబుసలాడె ద ♦ ర్వీకరములు: వనమృగంబులు మీఱె; గూ ♦ బలును జేరె. 69

చ॥ ఇరువదియైదువత్సరము ♦ లిప్పటి కెప్పుడొ దాటిపోయెఁ జి
త్తరువదు మోముకుంకుమము ♦ తోఁగను పున్నెముదీఱె; రేల ని
ర్దర పవ లన్నమున్ విడిచి ♦ దుర్దమదీక్షను నిన్నియేండ్లు సం
గర మొనరించినన్ జయము ♦ గల్గదు: కల్గను కల్గు నాసయున్. 70

గీ॥ పట్టభద్రుఁడనైన య ♦ ప్పటి విభవము సంపదయు మూఁడునాళ్ళ ము ♦ చ్చటగ జాఱె:
మునుపటి మహోన్నతులు గల్గు ♦ ననుతలఁపులు మెఱపులెండమావులుగాలి ♦ మేడలయ్యె.

సీ॥ భాగ్యనివాసముల్ ♦ పదివేల పల్లెలు కళలూఁడి కాఱడ ♦ వులుగ మాఱెఁ:
బరమరాసదము లె ♦ న్బదినాల్గు దుర్గముల్ తౌరుష్కవీరుల ♦ బాఱిఁ జిక్కెఁ:
బచ్చతోరణముల ♦ భాసిల్లు మేవాడ సహుషుఁ డేలిన యింద్ర ♦ నగర మయ్యెఁ:
ముప్పదియాఱు రా ♦ ణ్ముఖ్యవంశంబు లక్బరుఁ జేరి చరణపం ♦ కజముఁ గొలిచె:

గీ॥ దేశమెల్ల బోయెఁ: ♦ గోశంబు వమ్మయ్యె; సైన్యబలము డిందె; ♦ శక్తి కుందెఁ:
నక్కటకట! భార ♦ తావనిపై ధర్మ మెట్లు నిలుచుఁ! గీర్తి ♦ యెట్లు పొలుచు! 72

గీ॥ హంసతూలికామృదుల శ ♦ య్యలను బూలపఱపులను జేటికలు జోల ♦ పాడుచుండఁ
బెరుగు నాదు సంతాన మీ ♦ కఱకుఱాల వాన కెండకుఁ బలుపాట్లఁ ♦ బడల వలసె. 73

గీ॥ కూడు నీరులేక నశింతు ♦ క్రూరఘణులు గఱచు; నారణ్యమృగములు ♦ పెరుకు ననక
వృక్షముల వేర్లు బుట్టలఁ ♦ బెట్టి విడుతు; నరులు పెన్నాడఁగానినా ♦ భ్యంతరమున. 74

గీ॥ రాత్రి కురిసిన ఘోరవ ♦ ర్షమున నటమహీరుహముక్రిందఁ దడిసి మే ♦ మెల్ల నక్లి
నిలిచితిమి; రాణిగా రాఱు ♦ నెలలబిడ్డఁ బొదిగిఁట నెనిల్పుకొనెఁ బ్రొద్దు ♦ పొడుచువఱకు 75

సీ॥ చండార్కుఁ డంతరి ♦ క్షమహాపథంబునఁ జెలరేఁగి నిప్పులు ♦ చెఱగునపుడు,
గడ్డి గాదము సోఁకి ♦ కడలెల్ల దరికొని మెండుగా దావాగ్ని ♦ మండునపుడు,
భూతలం బెల్ల మ ♦ మ్ముగ లేచి సుడివడ భీకరవాతముల్ ♦ వీచునపుడు,
హెచ్చుతగ్గులు లేక ♦ యేకార్ణవంబగు కరణిఁ బెల్లుగ వాన ♦ కురియునపుడు,

గీ॥ డిలు వడంక భూకంపము ♦ లెత్తునపుడు, కడకుఁదలఁదాఁప నొక్కయిం ♦ కణము నీడ
చిక్కకయె, మేము పిల్లలు ♦ సుస్రిక్కు బాధ లకట! మాగర్భవైరుల ♦ కైన వలదు. 76

సీ॥ కనకసౌధాగ్రభా ♦ గములందు మూర్ధాభిషిక్తులౌ రాజయో ♦ షిద్వరేణ్య
లడుగులకు మడుగు ♦ లిడి కొల్వఁ గోమలతర హంసతూలికా ♦ తల్పమందు
నెండకన్నెఱుఁగక ♦ యుండి యింద్రాణిచాయను దేవభోగంబు ♦ లనుభవింప
వలసిన నారాణి ♦ పాటేశ్వరీదేవి భువనైక సౌజన్య ♦ పుణ్యసాధ్వి

గీ॥ యకట "యన్నమో రామచం ♦ ద్రా"యటంచుఁ బదియునేన్వురు బిడ్డలు ♦ పట్టిపెనఁగ
గోడుగోడునఁ గన్నీరు ♦ గ్రుక్కుకొనుచు నలమటలనెల్ల దిగ్రమింగి ♦ యడలవలసె.77
సీ॥ సారవంతము కైల ♦ వారామహామహీంధరపార్శ్వముల, సమ ♦ ధరణిఁ గట్టు
వడి దినమంతయుఁ ♦ బిడికెడు గడ్డియుఁ గ్రుక్కెడు నీరంబుఁ ♦ గ్రోలికొనుచుఁ
బరిశుభ్రతరమైన ♦ స్వచ్ఛందవాయువుఁ బీల్చుచుఁ గడుసాధు ♦ వృత్తి యలర,
నక్బరుతో రణం ♦ బారంభమైన యీ పదియునుదొమ్మిది ♦ వత్సరములు
గీ॥ నందనోద్యానభాగంబు ♦ నన్ మెలంగు కామధేనుసంతానము ♦ కరణి నెపుడు
పిల్లలును మేము బయల జీ ♦ వింపవలసె మానవుల కగ్రాహ్యమగు తిండి ♦ మఱచిపోయి.78
ఆ॥ కాళ్ళనిండ గుడ్డ ♦ కడుపునిండుగఁ దిండి, కంటినిండ నిద్ర, ♦ గాన కెపుడు
బిచ్చగాండ్రకన్నఁ ♦ బీదలమై యుంటి; మింక నెంతకాల ♦ మిట్లు కడచు! 79
మ॥ తఱితో నక్బరుసార్వభౌముఁడు నితాం ♦ తప్రాభవోపేతుఁడై
ధరణీచక్రము నేలు వేళను దరి ♦ ద్రత్వంబు దిక్కేది యు
ర్వరఁ దా నుండఁగఁ జోటుగానక మహా ♦ రాణాప్రతాపావనీ
శ్వరు సంసారము నాశ్రయించినది; యీ ♦ పాపంబు నేమందునో!
శా॥ భీతిన్ గొల్పు కరాళవక్త్రమున వే ♦ వేగన్ జరావ్యాఘ్ర మీ
నా తారుణ్యము మ్రింగఁగాఁ దివిరెఁ జెం ♦ తన్ బొంచి లేడిన్ బలెన్!
జేతస్థైర్యముగూడ సన్నగిలె! మా ♦ కిన్ సుంత యుత్సాహ! మే
రీతిన్ గార్యముఁ దీర్తు! నేపగిది మా ♦ తృప్రీతి సంధించెదన్! 81
గీ॥ గాలి వాన విధాన న ♦ ల్గడల రేఁగు కష్టముల కెత్తువడి డస్సి ♦ కడిమి తగ్గి
హృదయకోశంబు తన నైజ♦వృత్తి విడక యాడునో! యూడునో! తెలి♦యంగరాదు.82
మ॥ చనఁగాఁ జొచ్చెను నిర్వదేఁడులు మహా ♦ స్వాతంత్ర్యయుద్ధంబుఁ జే
యను నే దీక్ష వహించి నేఁటికి; భవి ♦ ష్యత్కాల తారాపథం
బున దూరమ్మననైనఁ గొంత విజయం ♦ పున్ గాంతిరేఖల్ మిను
క్కని చూపట్టవ! యే భగీరథుఁడు డా ♦ యన్ దెచ్చునో జాహ్నవిన్! 83
సీ॥ సంతత తౌరుష్క ♦ సంగ్రామవహ్ని చేఁ గాలఁగా మిగిలిన ♦ కట్టెనైతి;
నలిగొట్టి కుక్కయై ♦ నక్కి మూల్గెడు నక్కపైఁ దాఁటిపం దూడి ♦ పడినయట్లు
రక్త మేదో మాంస ♦ రాశి తగ్గి యకాలవృద్ధత్వ మిపుడు పై♦ కెక్కె నాకు;
నింక నెంతయొ కాల ♦ మీ శరీరం బిట్టె యనువుగా నుండునం ♦ చాస లేదు;

నా వెంటఁ జనుదేరఁ గోరినను స ♦ న్నాహంబుఁ గావించి వా
రో వీరో మఱి యందఱో కదలి రా ♦ రో! యింక మున్నాళ్ళకున్. 91

గీ॥ యవనసంసర్గమును వీడి ♦ యవలికేగుటే శుభంబని యెంతు; మీ ♦ రెట్లు తోఁచు;
నెమ్మిమెయిఁ దెల్పుఁడిపుడు; మీ ♦ నిర్ణయమును దాల్తుశిరమునమందార ♦ దామమట్లు" 92

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు ప్రతాపసింహు ననుసరింతునని నివేదించుకొనుట (*—

మ॥ అని వాక్రుచ్చియు నిల్చినంతట సలుం ♦ బ్రాధీశుఁడున్ లేచి భ
క్తిని హస్తంబులు మోడ్చి "భారతధరి ♦ త్రీ దాస్యనిర్మూలనం
బున దేశోద్ధరణంబునందు హృదయం ♦ బున్ నిల్పి యెంతెంత సే
యను సాధ్యంబగు నంతచేసితివి నీ ♦ వత్యంత దీక్షారతిన్. 93

సీ॥ వేనవేల్ రిపుల నొ ♦ ప్పించుపట్టునఁ గర్ణపేయమై వింటి నీ ♦ వీరగర్జఁ;
దలఁ ద్రుంచు బహుళాప ♦ దలు చుట్టినప్పుడు చెవియొగ్గి హుంకార ♦ రవము వింటిఁ;
దిండిలేక తపించు ♦ దినముల, విధిఁ జూచి పెడబొబ్బ వెట్టు చ ♦ ప్పుడుల వింటి;
స్వాతంత్ర్య సమరదీ ♦ క్షకుఁ బూన్చు నీ యుపన్యాసంబులను జెవు ♦ లార వింటిఁ;
గీ॥ గాని కొండంత నొప్పితో ♦ గాసిపడుచుఁ బిడుగు పడినట్లు హృదయముల్ ♦ బ్రీలఁజేసి
విన్ననై దీనమగువాక్కు ♦ విని యెఱుంగ; ననలమున ద్రేల్చునట్లు నా ♦ మనసుపొగిలె. 94

గీ॥ నీహృదయపద్మపీఠ ని ♦ ర్వ్యాహమెక్కి యలరి స్వాతంత్ర్యలక్ష్మి స ♦ హస్రభాను
కాంతులను వెల్గెఁ; దన్మహా ♦ ఖండదీప్తి కడలుకొని ఢిల్లి మొగలుల ♦ కనులుగుట్టె. 95

సీ॥ పురము రాజ్యము మాసి ♦ మూఁడేండ్లు శ్రీహరిశ్చంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి
పదునాలు గబ్దముల్ ♦ వనవాసమున రామచంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి
పదియు మూఁడేండ్లుగాఁ ♦ బాండవుల్ గహనాంతరములలోఁబడిన క ♦ ష్టముల నెఱిఁగి
యిరువదిమూఁడేడు ♦ లీవీ వనులఁ గుటుంబముతోడఁ బడిన క ♦ ష్టముల నెఱిఁగి
గీ॥ తారతమ్యంబుఁ దూఁచిన ♦ వారి యిడుమ లత్యగాధాపదావర్త ♦ మైన నీదు
చరితమున నొకపుట కొక్క ♦ చరణమునకు సాటిగావని గొంతెత్తి ♦ చాటనేర్తు! 96

సీ॥ అట్టి చూచిన దోసె ♦ డంతైన లేదు మేవాడరాజ్యము; సైన్య ♦ బలముగూడఁ
జాలనిదే! యుద్ధ ♦ సన్నాహ మల్పంబె! యటులున్న నేఁబది ♦ యైదు లక్ష
లగు కాల్బలము, పదు ♦ నైదు లక్షలగు గుఱ్ఱముదండు విస్తార ♦ రాజ్యలక్ష్మి
యేనుఁగులు పిరంగు ♦ లెన్నేని గలుగు విశ్వంభరాధీశుఁ డ ♦ క్బరునృపాలుఁ

గీ॥ దట్టె యుబ్బూఁత లూఁగి తూఁ ♦ గాడిపడఁగఁదాఁకఁగలిగితి; వెన్నిసా ♦ ధనముబున్న
నిన్నొకని గెల్వఁజాలక ♦ తన్నుఁగొనెడి ననుచు హాస్యాస్పదంబయ్యె ♦ నతని బ్రదుకు. 97

గీ॥ క్షణము విడక సైన్యము నంపి ♦ రణముసేయ నీపయికి నక్బ రంపించు ♦ నిరతధాటిఁ
బరిపయర్ సేన ‘గ్రీసు’పైఁ ♦ బరవలేదు;యవనులు ‘జరూసలెమ్ము’పై ♦నరుగలేదు.98

శా॥ ఈ విశ్వంభర పుట్టుటల్ మొదలుగా ♦ నిందాఁక నేదేశమం
దేవంశమ్మననైనఁ గష్టముల నెం ♦ తే నాత్మబంధుల్ వలెన్
భావంబందుఁ దలంచుచున్ వలచుచున్ ♦ స్వాతంత్ర్యమున్ గొల్చిరే!
నీ వొక్కండవు దక్క శాంతినిరతిన్ ♦ నిర్నిద్ర తేజోనిధీ! 99

ఆ॥ ఇట్టి దేశబంధుఁ ♦ డిట్టి శూరోత్తముఁ డిట్టి రాజయోగి ♦ యిట్టి త్యాగి
లేఁడు లేఁడ టంచు ♦ మూఁడులోకంబుల మ్రోఁత లీనెఁ; గురిసెఁ ♦ బూలవాన. 100

సీ॥ అక్బరువిశ్వంభ ♦ రాధీశమౌళిది ధనసేవ; నీయది ♦ దైవసేవ;
యాతని దెల్లప్పు ♦ డాత్మవైభవము; నీయది నిరంతరము నా ♦ త్మానుబోధ;
మతని కుండిన దెల్ల ♦ నైహికబలము; నిన్నాశ్రయించిన దెల్ల ♦ నాత్మబలము;
నతని దండఱ కన్ను ♦ లలరించు భోగంబు; నీది జగముమెచ్చు ♦ నిండుత్యాగ;
తే॥ మతఁడు జగము గెలిచె; ♦ నాత్మ గెల్చితివి నీ; వాతఁ డితరజనుల ♦ నాశ్రయించు;
నీవు స్వాశ్రయుఁడవు; ♦ నీకు నాతని కెనలేదు; జగముక్రిందు ♦ మీఁదులయిన. 101

గీ॥ కష్టమే మనపాలిటి ♦ కల్పతరువు; దుఃఖ మెఱుఁగని హృదయముల్ ♦ దుర్బలమ్ము;
లతి పరిమితంబయిన శక్తి ♦ యలరు నరుల కపజయంబులు బలవర్ధ ♦ కౌషధములు.102

మ॥ ధర సృష్టించిన బ్రహ్మ, ఫాలమున నే ♦ త్రంబుండు శంభుండు, న
ప్పురుషోత్తంసుఁడు శౌరియున్, నరులుగాఁ ♦ బుట్టొంది యేనూఱులో
తరముల్ పోరినఁగాని నీకరణి స్వా ♦ తంత్ర్యంబు నిట్లింత దు
ర్భర నిష్ఠారతిఁ గొల్వ లేరని వచిం ♦ పన్ నేర్తు వేనోళులన్. 103

గీ॥ శక్తి దాఁపక యాత్మవం ♦ చనము లేక నీయడుగునీడఁ దలఁదాల్చి ♦ నిన్నుఁగొలిచి
త్యాగ మించుక యెఱిఁగితి ♦ నను యశంబు సంతరించితి నర్హత ♦ చాలకున్న. 104

గీ॥ వాసుదేవుని చరణపూ ♦ జాసుమ మటు నిరత మాఁదలఁ దాల్తు నీ ♦ నిర్ణయమ్ము;
నీడ మెవాడ నున్న నే ♦ వాడనున్న క్షణమునినుఁబాసి యుండ నీ ♦ జన్మమందు. 105

క॥ మూన్నాళ్ళ గడువు లోనన సన్నాహ మొనర్చి మేము ♦ సంసారములున్
నిన్నుఁ గొలువంగ వత్తు”మటన్న “నటులెచేతు” మనుచు ♦ నంద ఱరుగుచున్, 106

❁ గీ॥ ధన కనక వస్త్ర వాహన ♦ తతుల నెల్ల బండ్ల నంపి మూన్నాళ్లకు ♦ వచ్చి చేరి;
రాణాప్రతాపు నానతి నంద ♦ అనుచరులును నశ్వముల నెక్కి కదల నా ♦ యత్తమైరి. 107

గీ॥ వచ్చి యాకారుపైఁ జేయి ♦ వైచి నిలిచి యాప్రతాపప్రభూత్తముఁ ♦ డాగిరీంద్ర
సమతలమునుండి చుట్టుదే ♦ శంబునెల్లఁ గలయఁ గన్గొనెఁ గన్నీలం ♦ కులుద్రవింప.

---

❁ పాఠాంతరము.

గీ॥ వాసుదేవుని చరణపూ ♦ జాసుమమటు నిరత మాఁదలఁ దాల్తు నీ ♦ నిర్ణయంబు
నీడ మేవాడనున్న నే ♦ వాడనున్న నేను నీవాఁడ ననువాఁడ ♦ నెపుడుఁగూడ.

క॥ మూన్నాళ్ల గడువులోపల సన్నాహ మొనర్చి మేము ♦ సంసారములన్
నిన్నుఁ గొలువంగ వత్తుమటన్న "నటులె చేయుఁ"డని ధ ♦ రాధిపుఁ డనఁగన్,

గీ॥ ధన కనక వస్త్ర వాహన ♦ తతుల నెల్ల బండ్లపైఁ దోవపట్టించి ♦ పంపి రాజ
పుత్రవీరులు మఱల నా ♦ బూగిరీంద్రమునకు వచ్చిరి ప్రభుభక్తి ♦ యినుమడింప.

గీ॥ మెఱుఁగు బంగారు పూలువోల్ ♦ కిరణతతుల బాలభానుఁడు ప్రకృతిశో ♦ భలను బెంప
నలసలుంబ్రాధిపతిఁ జూచి ♦ యాప్రతాపుఁ "డేకలింగేశునకు మ్రొక్కి ♦ యిపుడె వత్తు

గీ॥ అంతలోన మీరందఱ ♦ ననుచరులను బయన మొనరింప నాయత్త ♦ పఱచుఁడనుచుఁ
బలికి గర్భాలయంబులో ♦ పలికిఁ జనియె! వగలఁ బొగులుచు నాసలుం ♦ బ్రాధిపుండు,

సీ॥ పలదన్న సామ్రాజ్య ♦ పట్టాభిషేకంబు సలిపితి భువన మా ♦ శ్చర్యపడఁగ!
బయటికి వెడలుచో ♦ వనిలోన ముండ్లను రాల్ దీసి త్రోవ శు ♦ భ్రముగఁ జేతు!
"నాహేరియా" వేఁట ♦ కరుదెంచునపుడెల్ల సన్నిసామగ్రు లా ♦ యత్తపఱతు!
శాత్రవు లెదురైన ♦ క్షణమున సకలసైన్యము దీర్చి యనికి సి ♦ ద్ధముగనుంతుఁ!

గీ॥ గాని, గుండెలు బరువెక్కఁ ♦ గా స్వదేశ మట్టె విడనాడిపోవుచో ♦ ననుచరులను
సర్వసన్నాహమునఁ బూన్చు ♦ జాలిమాలినట్టి కార్యము చేయు టె ♦ ట్లైన నెఱుఁగ.

మ॥ అదిరా! దేవుని కన్నమిన్న యని భ ♦ క్త్యావేశమున్ బెంచి యి
ర్వదిమైదేండ్లుగ దేశమాతకు సప ♦ ర్యల్ చేసి శుష్కించి క
ష్టదశన్ గుందిన విశ్వవీరునకు దే ♦ శత్యాగమున్ జేయు దుః
ఖదశన్ దెచ్చితె! దుష్టదైవమ! మహో ♦ గ్రం బయ్యె నీచెయ్దముల్!

సీ॥ ఎత్తినచేయి యిం ♦ తేని దింపక రణాగ్రముల శాత్రవుల శీ ♦ ర్షములు తఱిగె!
విశ్వవిశాలమై ♦ వెలసిల్లు హృదయంబు స్వాతంత్ర్య లక్ష్మి కా ♦ స్థాన మిచ్చెఁ!

—*) ప్రతాపసింహుఁడు మాతృదేశమునకుఁ దుది నమస్కార మర్పించుట (*—

ఉ॥ "అకటా! చేసిన యన్నియత్నములు వ ♦ మ్మై గెల్పు సున్నైనఁ జే
రక దైవోపహతుండునై యిదె మహా ♦ రాణాప్రతాపుండు తా
నక కల్యాణ పదాంబుజాత యుగ సే ♦ వా భాగ్యముల్ వీడి కా
లికిఁ గోల్పోజను నన్యసీమలకుఁ; ద ♦ ల్లీ! వీని నెట్లోర్తువో! 109

శా॥ శ్రీమం బంచెడు నీదు శైలశిఖరం ♦ బుల్ మంజులంబైన యా
రామశ్యామలసీమలుల్ ప్రబల దు ♦ ర్గశ్రేణులుల్ సారవ
ద్భూములుల్ నీ సముదార భాగ్యవిభవం ♦ బుల్ వీడిపో నుంటి; క
ల్లీ! మేవాడ సతీమతల్లి! మదిలోఁ ♦ గ్లేశంబు రా నీకుమీ! 110

గీ॥ ఇరువదేండ్లుగ నుత్తమ ♦ పరికరముల భక్తిఁ గూర్చి నా పావన ♦ [illegible] 111
దల్లి! నేఁగట్టుకొనిన స్వా ♦ తంత్ర్య వజ్రభవనరాజంబు కన్నిటి ♦ [illegible]

మ॥ అతిభీమంబుగఁ బెల్లు రేఁగి నిబిడం ♦ బై మూఁగి యీ సర్వభా
రత దేశంబును ముంచివైచిన మహా ♦ గ్రంబైన దాస్యాంధకా
రతతిన్ దేవుని దృష్టిగూడ నణుమా ♦ త్రంబున్ జొరన్ బోని మ
త్స్థితి సంధించెడు పాపికాల మరుదెం ♦ చెన్; జూచి యెట్లోర్తునో! 112

దనదుసర్వస్వ మ ♦ ర్పనచేసి మాతృదేశారాధనమునఁ బు ♦ ణ్యాత్ముఁ [illegible]
ద్యాగానురక్తి ధ ♦ ర్మాసక్తి విశ్వోన్నత స్థానమంది త ♦ ద్దయును [illegible]

గీ॥ జతు రుదధి సంవృతావనీ ♦ సార్వభౌమ పదవి గానున్న మాతృభూ ♦ [illegible]
విడని రాజర్షి చందురుండు ♦ వెడలవలసెఁ దనదు సీమలోఁ దలదాఁచు ♦ [illegible]

సీ॥ త్రిభువనాదర్శ వం ♦ దిత పరమోత్కృష్ట సద్గుణగణరత్న ♦ [illegible]
రాణాప్రతాప వీ ♦ రప్రభు వదనమం దలరారు నవమంద ♦ [illegible]
జీవనౌషధముగఁ ♦ ద్రావి యెట్టెట్టులో దినములు కడఁద్రోచి ♦ [illegible]
నా యభాగ్యముమీఱి ♦ నాస్వామి తరితప్పి యకటా! దైవోప ♦ [illegible]

గీ॥ గట్టు! దరహాసశూన్యమై ♦ కాంతిలేని యీమహారాజు ముఖము [illegible] ♦ [illegible]
నెట్లుభరియింతు! నెటుమాను! ♦ నేమియందు! ముందుమాకుండు [illegible] ♦ [illegible]

గీ॥ అనియరిగి కొండయంత దై ♦ న్యమునఁ గుందియనుచరుల నశ్రుముల [illegible] ♦ [illegible]
నల్ల నల్లన గర్భాల ♦ యంబు విడిచి వాకిటిని దాటి రాజలో ♦ [illegible]

గీ॥ వచ్చి యంకారుపైఁజేయి ♦ వైచి నిలిచి యఖిలభువన ప్రపూజ్య [illegible] ♦ [illegible]
సమతలమునుండి చుట్టు దే ♦ శంబునెల్లఁ గలయఁజూచె [illegible] ♦ [illegible]

సీ॥ విశ్వపావనమైన ♦ వృత్తి వర్తించు గోబ్రాహ్మణులకుఁ దగ్గు ♦ పాటు గలిగె;
ధాతృనిభుల్ మునుల్ ♦ స్థాపించు వర్ణాశ్రమాచారవిధు లడు ♦ గంటిపోయెఁ;
బెట్టని కోటలై ♦ వెలసి నిన్ గొల్చు వీరుల పౌరుషము గంగ ♦ గలిసిపోయె;
మంగళలక్ష్మి స ♦ మానలౌ సాధ్వుల సౌశీల్యగరిమ కా ♦ ర్శ్యంబు నందె;
గీ॥ వేయునేండ్లుగ వ్రేటుపై ♦ వ్రేటుదగిలి చిక్కి సిదక్కి స్రుక్కి కృ ♦ శించి నాదు
పాలనమున మంచముపట్టి ♦ డీలుపడఁగఁ బాలుపడితివె! తల్లి! మే ♦ వాడలక్ష్మి! 113
సీ॥ మాతృదేశము శుద్ధ ♦ మతిఁ గొల్వఁగాఁజాలు సుతుఁడును లోకవం ♦ దితుఁడటంచు
భౌతికసుఖము స ♦ ర్వము సన్న్యసించి ధర్మైకవర్తనుఁడనై ♦ యిన్నినాళ్లు
రక్త మేదో మాంస ♦ రాజి నూడ్చుచు నిన్ను నుద్ధరించి కృతకృ ♦ త్యుండ నగుదు
నని కృషి చేసితి; ♦ నక్కట! నాపాపి హస్తము లాభాగ్య ♦ మంద లేవు!
గీ॥ పూర్వవైభవమున నీవు ♦ పొదలుచుండ నా కలుష నేత్రములఁ జూడ ♦ లేక పోతి!
నాశ లడుగంటెఁ! బ్రాణంబు♦లవిసిపోయెఁ; బ్రతుకె వృథయయ్యెఁ! దల్లి! మే♦వాడలక్ష్మి!
సీ॥ పసితనమ్మున లేడి ♦ వలె లాఘవమ్మున నద్రుల కెగఁబ్రాకి ♦ నట్టిచోట్లు!
పట్టాభిషేకసం ♦ పద్విభూషితుఁడనై యధికృతి నెఱపిన ♦ యట్టిచోట్లు!
కవచ ఖడ్గము లూని ♦ కదనరంగమున ఘోరారులఁ గడతేర్చి ♦ నట్టిచోట్లు!
నొకఁడనై, శత్రుల ♦ నుడికించి జగ మెన్న నపజయంబు వహించి ♦ నట్టిచోట్లు!
గీ॥ కట్ట బట్టయుఁ దినఁ గూడు ♦ గానకున్న నచలభక్తి నిన్ సేవించి ♦ నట్టిచోట్లు!
హృదయఫలకమ్మునందు ము♦ద్రితములయ్యె; మఱువలేనమ్మ! నను నేను♦మఱచుదాఁక!
గీ॥ వీరు లాత్మీయు లాప్తులు ♦ పృథ్వివరులు బంధువులు నీగిరీంద్ర గ ♦ ర్భముల నొఱుఁగ
బిరికిదొంగనుగా నిన్నుఁ♦దొఱఁగి జాఱ, వ్రాసె నాతల ధాత! మే♦వాడ మాత! 116
గీ॥ తలఁ దఱుగనోపు బహువిప ♦ ద్దశలనైనఁ గాంతి యించుక చెడని నా కన్నుదోయి
నశ్రుకణములు వోడమె; నీ♦యడుగుదోయినమ్మ! ముక్తాభిషేకంబు ♦ నాచరింతు. 117
శా॥ నేనే గాక మఱొక్క ధీరుఁ డెవఁడే ♦ నిన్ నిన్ను సేవింప నెం
తేనిన్ బూనిన, వాని పుణ్యమున నే ♦ నిన్ దల్లి! మేవాడ ల
క్ష్మి! నిత్యోత్సవ నిత్య మంగళ జయ ♦ శ్రీ నిత్య సౌభాగ్య రే
ఖా నిత్యప్రభ లెల్ల నీకుఁ గలుగున్ ♦ గాకంచుఁ గాంక్షించెదన్. 118
సీ॥ హారావళీశైల ♦ మనుపమస్వాతంత్ర్య వీరదుందుభుల శ ♦ బ్దించుఁ గాక;
గట్టలు పుట్టలు ♦ గుహాలు స్వధర్మతత్పరుల యశంబు మా ♦ ర్పలుకుఁగాక;

మేవాడరాజ్యల ♦ క్ష్మిపరాక్రమ మెల్లవేళల భువిఁ దాఁడ ♦ వించుఁగాక;
త్యాగైకధనుల స ♦ త్యస్వరూపులచే రహించి నీకడుపు ఫ ♦ లించుఁగాక;
॥ భానుకులగౌరవంబు ని ♦ ల్పంగ నోడి త్యాగమునఁ గుంటువడి నీప ♦ దములఁ గొలుచు
పున్నెములు లేకదూరభూ ♦ ములకు నేగు మమ్ము మాపేళ్ళు లోకంబు ♦ మఱచుఁగాక." 119
॥ అనుచు భక్తి నిజూపి వం ♦ దన మొనర్చి మఱువఁజాలక చేరెడు ♦ మట్టి దీసి
కనుల నద్ది రుమాలునఁ ♦ గట్టి యూర్చి యాప్రతాపుఁ 'డంకారు' పై ♦ నధివసించె. 120

—*) పర్షియా ప్రయాణము (*—

॥ ఆరీతి నెల్లవారలు చేరెడు చేరెడుగ మట్టి ♦ చేకొని తలలన్
జేరిచి మ్రొక్కుచుఁ బయనం బారంభించిరి ప్రతాపుఁ ♦ డందఱ నడుపన్. 121
॥ ఆత్మదేశంబు విడనాడ ♦ నడరు పొడమి గుండె బరువెక్క; నెలుఁగుడ ♦ గ్గుత్తుక వడె;
నచలరంగంబు వదలి వా ♦ యవ్యదిశకుఁ దరలి రందఱు మానము ♦ ద్రలు వహించి. 122
॥ ఒకరినొక్కరు పల్కరిం ♦ పక యెత్రోవఁ బ్రకృతిసౌందర్యమింత చూ ♦ డక యె యశ్రు
ధారలన్ దోఁగి దైన్యము ♦ ద్రలనుదూఁగి వార లరిగిరి గిరిపాలి ♦ మేరఁ జేర. 123

—*) భామాసాహిమంత్రి మేవాడకు వచ్చుట (*—

॥ ముడుతలువడ్డ మో ♦ మునఁ బట్టెవర్ధనం బఱుత జందెంబు బ్రా ♦ హ్మణతఁ దెలుప,
నిండార నెరసి పం ♦ డిన శిరోజమ్ములు కమియ మాఁగిన వయో ♦ గరిమఁ దెలుప,
వ్రాలిన బొమల వె ♦ ల్వడు వాఁడి నునుఁజూపు లెనిరి డెందముఁజొచ్చు ♦ పదను దెలుప,
నధరంబుపై నంటె ♦ యంటని చిఱునవ్వు తొలకని నిత్యసం ♦ తుష్టిఁ దెలుప,

---

⊛ Unable to stem the torrent, he had formed a resolution worthy of his character, he determined to abandon Mewar and the blood stained Chittoor (no longer the stay of his race) and to lead his Sesodias to the Indus, plant "the crimson banner" on the insular capital of the Sodgi, and leave a desert between him and his inexorable foe. With his family and all that was yet noble in Mewar, his chiefs and vassals, a firm and intrepid band, who preferred exile to degradation, he descended the Arawulli and had reached the confines of the desert, when an incident occured which made him change his measures, and still remain a dweller in the land of his fore-fathers. If the historic annals of Mewar record acts of unexampled severity, they are not without instances of unparalleled devotion.

"Annals of Mewar."

గీ॥ బుజమునను బైరవాసము ♦ మొగమునందు బ్రహ్మవర్చస ముదితమై ♦ పరిఘవిల్ల
❀ నుక్కఁదునుకఁబోలినయశ్వ♦మెక్కియుక్క శాంతమూర్తి బ్రాహ్మణుఁడుసా♦క్షాత్కరించె.
సీ॥ ఆగుంపునకు నెల్ల ♦ నగ్రభాగమున వర్తించు ప్రతాపేంద్రు ♦ దెసను జూచి
యావృద్ధభూసురుం ♦ డశ్వంబు నిలిసి "యోవీరపుంగవ! నేను ♦ దూరదేశ
మందుండి వచ్చితి ♦ నయ్య! యీకొండలయందుఁ బ్రతాపేంద్రుఁ ♦ డధివసించు!
నెఱుఁగుదురే కద! ♦ యెయ్యది త్రోవ! నా కెఱిఁగింతురె కృప వ ♦ హించి" యనిన
గీ॥ నాత్మదేశంబు విడువఁ గొం ♦ డంత నగపు దోఁపఁ దలయెత్త కరుగు ప్ర ♦ తాపదేవుఁ
డామహీదేవు దివ్యవా ♦ క్యమ్ములపుడు విని వినక తనత్రోవను ♦ జనుచునుండె. 125
శా॥ "ఏమయ్యా! దయయుంచి యిట్లు కనుఁగొ ♦ న్మిమ్మ! వృద్ధుఁడన్; దూరపున్
సీమల్ దాఁటుచుఁ బెక్కు కష్టముల గా ♦ సిన్ బొంది నే వచ్చితిన్;
భూమీశుండు ప్రతాపుఁ డీగిరుల నెం ♦ దున్ గాపురం బుండు! నెం
దే మీ రాతనిఁ జూచియున్న సెలవీం ♦ డీ"యంచు బ్రార్థించినన్, 126
క॥ కనులెత్తి రాజమణి విప్రుని వదనముఁ గాంచి యశ్వ ♦ ము నిలుపుచు "నో
యనఘా! మీ రెవ! రెందులఁ జనుదెంచితి"రన ద్విజన్మ ♦ సత్తముఁ డంతన్, 127
సీ॥ "పరిషియానుండి నే ♦ వత్తు; భామాసాహి నాపే"రనినఁ దత్క్ష ♦ ణమ ప్రతాపుఁ
డాస్యంబు వికసింప ♦ నశ్వంబు డిగి భక్తితాత్పర్య విహితప్ర ♦ దక్షిణంబుఁ
జేయుచు నల్లనఁ ♦ జేతులు జోడించి "నిరతంబు నీపాద ♦ నీరజములు
భజియించు నీదు సే ♦ వకుఁడు రాణాప్రతాపుఁడు మ్రొక్కుచుండె నీ ♦ యడుగువ్రోయి"
గీ॥ నని నిలువ నంద అనుచరు ♦ లబ్బురమున నశ్వములనుండి దిగిరి; ధ ♦ రాముహోత్త
ముఁడు తురంగము డిగ్గి య ♦ ప్పుడమితేనిఁ గౌఁగిటను జేర్చి హర్షాబ్ధిఁ ♦ దోఁగి నిలిచి, 128
శా॥ "నా విశ్వోన్నత దివ్యకల్పతరువున్ ♦ నా వజ్రకోటీరమున్
నా విస్తార మనోంబుజాతతరణిన్ ♦ నా కీర్తినిక్షేపమున్
నా వేల్పున్ మణి నాదు రాజధనమున్ ♦ నా స్వామి దర్శించి నా
సేవన్ గూర్పఁగ వచ్చినాఁడఁ; గృప వీ ♦ క్షింపంగదే! భృత్యునిన్. 129

---

❀ The minister of Pratap whose ancestors had for ages held the office placed at his prince's disposal, their accumulated wealth, which with other resources, is stated to have been equivalent to the maintenance of twenty five thousand men for twelve years.

"Annals of Mewar."

పరిశుభ్రతర సుధాసాగర వీచిక లట్లు నీదు ♦ ఘనకీర్తికళల్
మెఱసె దెసల; నీయంతటి పరమోత్తమధర్మవీర ♦ పరుఁ డుండెడునే! 130

స్తిమితమై తుదల వి ♦ చ్చి యుదార గంభీరకాంతు లీను వెడంద ♦ కనులతోడఁ;
బరువంపు బుగ్గల ♦ పైన రెక్కొను మీసల వెలుంగు మోము వా ♦ లకముతోడ;
వీరమహాలక్ష్మి ♦ విహరించు దగ్గమై విరిసిన బలితంపు ♦ టురముతోడఁ;
దలయెత్తు వాఁడి కుం ♦ తముఁ గేల నూఁది ధీరత యుట్టిపడ నిల్చు ♦ రాణతోడ;
నొదలఁ దురాయి, వీరతే ♦ జోదురీక్ష వదనమునఁ గుంకుమపుబొట్టు ♦ వజ్రవర్మ
మొదల వెలుగొంద నలరు నీ ♦ పాడవ్రుఁగంటి; నెంత కళ గల తండ్రివో ♦యీ! ప్రతాప!

సత్త్వబుద్ధిని రిపు ♦ షడ్వర్గము నెదిర్చి గెల్చినా; వరులను ♦ గూల్చినావు!
తులలేని దేశభ ♦ క్తులయందు మేటివై హెచ్చినావు; యశంబుఁ ♦ దెచ్చినాఁడ!
విరువదేండ్లుగఁ బైన ♦ నొఱగు నాపదలెల్ల నోర్చినావు; జయింప ♦ నేర్చినావు!
కులసనాతనధర్మ ♦ ములను సుస్థిరము గావించినావు; ప్రబోధ ♦ మెంచినాఁడ!
లోకమే పరి నిన్నుఁ గననెంచి♦యుంటి; నిదియె తరుణ మనుకొంటి; నీదివ్య ♦ ధవళయశము
నెంచుకొనుచుంటి; నితరుల ♦ కిది యలభ్యమంటి; నూఱేండ్లు నీకు దీ ♦ ర్ఘాయు వంటి"
అని యాశీర్వాద మొనర్చిన విప్రోత్తముని జూచి ♦ నృపగురుఁడును "దే
వునియట్లు చేరవచ్చిన నినుఁ గని ధన్యుండ నైతి ♦ నే నియ్యెడలన్. 133

మును చాణక్యయుగంధరప్రముఖులన్ ♦ బోలెన్ మహానీతివి
ద్యను మేవాడనృపాళికిన్ గఱపి రా ♦ జ్యం బూర్జితంబై వినూ
తన కల్యాణ జయోదయాదికము లం ♦ దన్ జేసి మాభక్తి కె
ప్డును బాత్రమ్మగు నీదు దివ్యచరణం ♦ బుల్ గంటి నీనాఁటికిన్. 134

భవదత్యుత్తమనామ మెల్లపుడు మే ♦ వాడ్ దేశమందెల్ల గౌ
రవధామంబయి యొప్పుఁ; గట్టకడ కు ♦ గ్రామంబులందున్ బ్రజా
నివహం బద్దమ రేయి మాటవరుసన్ ♦ నీపేరు విన్నంత భ
క్తివిరాజిల్ల నమస్కృతుల్ సలిపి నిన్ ♦ గీర్తింతు రోసద్గురూ! 135

పరిషియా కేగుదెంచి నీ ♦ చరణపూజ సలుపవలెనంచు నెన్నిమా ♦ ఱులో తలఁచితి;
నిమిష మూపిరి పోని యు ♦ ద్ధముల మునిఁగి కాలు గదలింప లేక యీ ♦ లీల నుంటి"
అనుచు వచియించినంత హ ♦ ర్షాంబురాశిఁ దేలి భూదేవమణియు "నో ♦ దేవ! నేను
నిట్లె యనుకొని యనుకొని ♦ యెట్లో నేఁడు కాలు గదలించుకొనుచు రాఁ ♦ గలిగినాఁడ

గీ॥ అనయ మేఁ గొల్చు పూర్వమ ♦ హామహీంద్ర శుభ తపః ఫలమును నిన్నుఁ♦జూచుకతన
జన్మ చరితార్థమయ్యె; నె♦చ్చటికి నేఁటి పయన మోయన్న!" యనఁ బ్రతా♦పప్రభుఁడు;

గీ॥ "స్వామి! నినుఁబూజచేసి పం ♦ జాబుకవల నే స్వతంత్రరాజ్యము నిల్ప ♦ నిటు వెడలితి;
వెనుకఁబోయినతీవయే ♦ యెదురుపడియె ననఁగ, నిందె నీదివ్యద ♦ ర్శనము గలిగె. 139

గీ॥ మేరువును బెల్లగించి కో ♦ టీర మిడుమ నుదయపురలక్ష్మికని లోక ♦ మురలఁదాఁకి
యిరువదేండ్లు పోరితి; నా య♦దృష్ట మెల్లఁజెడియె నీవిధమున; నేమి ♦ చేయువాఁడ." 140

—*) భామాసాహి ప్రతాపసింహునకు ధర్మోపదేశంబు చేయుట (*—

సీ॥ అని దైన్య మడరఁ బ♦ల్కినను భామాసాహి విని విన్నవోయి యా♦ననము వంచి
"శ్రీహరీ! నాదుర♦దృష్ట మేమందు! నీవలన నింతటి వేఁడి ♦ పలుకు వింటి;
నీవార్త విని వ్రీల♦దే! హృదయము శిలాఫలకమో! లోహమో! ♦ వజ్రమొక్కొ!
నూఱామడలదూర ♦ మీరీతి వచ్చు నుత్సాహమ్ము సుడిసి వి♦ధ్వస్తమయ్యె;

గీ॥ నకట! నామేనఁ గొనియూపి ♦ రాడుచుండఁ బరమపుణ్యస్వరూప మే ♦ వాడలక్ష్మి
వైభవప్రాభవాంకంబు ♦ భానుకులము చెడిన నోర్తునె! విధివ్రాలు♦తుడుతుఁగాక. 141

మ॥ అకటా! యుత్తమభారతీయుఁడవు ఘో♦రాపత్సమూహంబు నిం
చుక లెక్కింపని విశ్వవీరుఁడవటం♦చున్ నిన్ను లోకప్రజా
నికరం బెప్పుడు సంస్తుతుల్ సలుపఁగా, ♦ నీవే స్వకృత్యంబు నూఁ
దక పోనాడిన ధర్మ మెట్లు కొమరొం♦దన్ నేర్చు లోకమ్మునన్! 142

గీ॥ నడి యెఱుంగని కర్మవీ♦రుఁడవు నీవు; నీకు జయమైన నదియు లో♦కైకజయము;
నపజయంబైన నదియు దే♦శాపజయమునై ప్రపంచాపజయమునా ♦ ననఁగవలయు.

గీ॥ పెక్కువేల్ మైళ్ళపై నున్న ♦ విందు నెపుడు నీదుపరిపాలనముఁగూర్చి ♦ నీయఖండ
కదనదీక్షనుగూర్చి త్యా♦గంబుఁగూర్చి సాహసముఁగూర్చి కర్ణర♦సాయనముగ. 144

సీ॥ మాపూర్వు లెప్పుడు ♦ మీపూర్వనరపాలమౌళుల చెంగట ♦ మంత్రులగుచు
వెలలేనిభక్తితోఁ ♦ గొలిచిరి; నిరుపమత్యాగశీలుఁడు చండ ♦ ధరణిపతి ప్ర
ధానప్రధానిప♦దము నొందు పిదప రెండవ మూఁడవ ప్రధాను♦లవుచు నాదు
పితరులు నేను సే♦వించుచుంటిమి; నల్వదేండ్లయ్యెఁ బరిషియా♦కేగి నేను;

గీ॥ పరమ ధార్మికులైన మే♦వాడనృపుల నెమ్మది స్మరింపకయె యీది♦నమ్ముదాఁక
దేవ! పిడికెడాహారము ♦ దిని యెఱుఁగము; నాశరీరంబె మీది ప్రా♦ణంబె మీది. 145

మ॥ వితతప్రేమను నేను గొల్చెదు మహీ ♦ భృద్వంశము న్దిట్టి గ
ర్వితశౌర్యాఢ్యుని నిన్నుఁ బోలిన మహా ♦ వీరుండు జన్మించెనం
చతిహర్షమ్మున మండువేసవి నుద ♦ గ్రీయాసభారంబు నో
ర్చితి; దూర మ్మిటు లేగుదెంచితి; భవ ♦ చ్ఛ్రీపాదముల్ గొల్చితిన్. 146

క॥ కడు వృద్ధుఁడ; మేవాడ్ భక్తుఁడ; సచివుఁడ; భూమిసురుఁడఁ; ♦ దోఁచిన మాటల్
నుడివెద; విని నీ తోఁచిన వడువున మెలఁగంగవచ్చు ♦ వలదనను నృపా! 147

సీ॥ మేవాడ విడిచి యిం ♦ కేవాడలకునైనఁ బరువెత్తిపోవుట ♦ భావ్య మగునె!
పాదరసమువోలెఁ ♦ బరిపరివిధములఁ బాఱిపోయిన దాన ♦ ఫలము గలదె!
నిలువుము; ధైర్యంబు ♦ నిలుపుము; నీ పరిస్థితులెల్లఁ జక్క యో ♦ జించుకొనుము!
ఆత్ర మేటికి? శాంతి ♦ నందుము; నిన్నుండి నీవెప్డు దూరంబు ♦ పోవలేవు!
గీ॥ చక్రవాళాచలము దాఁటి ♦ చనినఁగాని వనధిసప్తకమున మునిం ♦ గినను గాని
కడ కెచటి కేగినను బ్రతా ♦ పుఁడవుగాక మాఱి మఱియొక్కరుఁడవగు ♦ మాత్ర గలదె! 148

గీ॥ చనదు కృషి నిరసింపఁగా ♦ సాధకునకు; నదియ యన్నిఁట నరుని యో ♦ గ్యతను బెంచుఁ;
గృషిని రోయు వానికిఁ జోటు ♦ క్షితిని లేదు; వసుధ కెల్ల శుభం బట్టి ♦ వాని పోక. 149

గీ॥ అలజడిని మునిగినపుడె స ♦ త్యము జయించు; నపజయంబుల నది పెంచు ♦ నాత్మశక్తి;
యనుపమత్యాగమును సత్య ♦ మాప్తమిత్రులంద్రుః స్వాతంత్ర్యతత్త్వజ్ఞు ♦ లైన బుధులు. 150

గీ॥ అఖిలదిశలందు నాపద ♦ లలముకొనుచు దిక్కుదోఁపని విషమ సం ♦ దిగ్ధదశల
ధైర్యమును జిక్కబట్టక ♦ తలఁగె దేని నిబలము చాల దనియె నే ♦ నిర్ణయింతు. 151

గీ॥ ప్రాణమున కెక్కుడైన మే ♦ వాడ వీడి వెడలిపోఁగాదు; పోఁగాదు; ♦ వినుఁడు నాదు
ప్రార్థనము; కాదు కూడద ♦ టంచుఁ బోవఁదలఁతు వేనియుఁ బోనీక ♦ నిలువరింతు. 152

ఉ॥ పూవులు రాలె; నాకులును ♦ బోయెను; ముండ్లును మ్రోడు నిల్చె; నీ
వీవిధిఁ గేతకిన్ విడువ ♦ కేటికిఁ జుట్టె"! దనన్ "వసంత ల
క్ష్మీవిభవంబు పోఁకినఁ జి ♦ గిర్చి తరుల్ కుసుమించునన్న యా
శావిసరంబుచే నిలుతు" ♦ నంచు వచించుఁ గుమారభృంగముల్." 153

క॥ అని వచియింపఁ బ్రతాపుని కనులను ముత్తెంపు టశ్రు ♦ కణములు జాల్వా
రిన విప్రసచివుఁ గని "యేమని నీవాత్సల్యగరిమ ♦ నభినందింతున్. 154

చ॥ పరిమితశక్తుఁ డొక్కెడ వి ♦ పర్యయవేళ స్వధర్మ మార్గముల్
దొలఁగునయేని వత్సలతఁ ♦ దోఁచి మహాపురుషాకృతిన్ బరా

త్పరుఁడు ప్రబోధ మిచ్చుచు న ♦ పాయముఁ గాచి పథంబుఁ జూఁపునం
చెఱుఁగుదు మిమ్ముఁవంటి విబు ♦ ధేంద్రుల మూలమునన్ గురూత్తమా! 155

గీ॥ స్వామి! నాపైనఁ బరమవా ♦ త్సల్యపకశత నింతదూరము వేంచేసి ♦ యిటు లపార
పురుషకారము నేర్పు న ♦ మూల్యహితము దైవ నిర్మాల్యమటు శిర♦సా వహింతు. 156

గీ॥ అఖలభువనావనంబు నీ ♦ యమృతగీతి నాహృదయతంత్రులను మీటి ♦ నను గఱంచె;
హరగురు పదంబులటు నీప ♦దాంబుజమ్ము లనఘ! యనవరతమ్ము సే♦వ్యములునాకు.

సీ॥ అభిలషించినరీతి ♦ నాజ్ఞ సేయుచు దేవ! పనిగొను”మని వచిం ♦ పంగ, విప్ర
సత్తముండును “క్షణ ♦ క్షణ మమూల్యం బిప్డు; కాలంబు వృథసేయ ♦ గాదు మనకుఁ;
జర్చింపఁ దగిన వి ♦ షయము కొంచెమె, నిమేషము మాటలాడినఁ ♦ జాలు! ప్రకృత
మనుసరింతము! లేదు ♦ వ్యవధి; జా గేటికి! రమ్మల్ల నింబవృ ♦ క్షమ్ము దరికి;

గీ॥ మఱచి తింకొకమాట నీ ♦ మంత్రిమాళి యనుభవజ్ఞుండు; స్వామిభ ♦ క్తాగ్రగణ్యుఁ;
డల సలుంబ్రాధిపతిఁ బిల్వు;♦మాయనఘుఁడు లేని మంత్రాంగ మదిపూలు♦లేనిపూజ.”

మ॥ అని బోధింపఁ బ్రతాపసింహుఁడు సలుం ♦ బ్రాధీశ్వరున్ హెచ్చరిం
చిన నాధన్యుఁడు చేరఁగా నరిగి “మీ ♦ శ్రీపాదరాజీవద
ర్శనమున్ జేసెడి యీవిధేయుఁడె సలుం ♦ బ్రాకృష్ణసింహుం'' డటం
చని సాష్టాంగనమస్కృతుల్ సలుప, న ♦ య్యాచార్యుఁడున్ బ్రీతుఁడై; 159

—*) భామాసాహి-ప్రతాపసింహునకు రాజనీతి నుపదేశించుట. (*—

॥ లెమ్మనెఁ; జని ముప్వురు వృక్షమ్ముదరిన్ జేరి; రధిక ♦ సంతోషము చి
త్తమ్మున వెలయఁగ నృపు నాస్యమ్మును గని “యవధరింపు ♦ మవధానముతో. 160

॥ స్వా మ్యమాత్య సుహృత్కో ♦ శ♦సైన్య దుర్గరాష్ట్రములు నను నివి యేడు♦ప్రకృతులం ద్రు;
ప్రకృతిబల మున్న నేకాని ♦ పార్థివునకు నించుకేనియు నాస్తిక్య ♦ మెసగఁబోదు. 161

॥ ఇన్నిఁటను నెన్నియున్నవో ♦ యెంచిచూత; ముత్తమకులీనతయు మహో ♦ దాత్తవీర
వర్తనము సత్యసంధత ♦ వఱలు నీకు రాజరాజుగ నుండ న ♦ ర్హతయు కలదు. 162

ఉ॥ సువిశాలస్థిరబుద్ధియై యనుభవ ♦ జ్ఞుండై కడున్ స్వామిభ
క్తివికాసస్ఫురితుండునౌ నృపతినీ ♦ తిజ్ఞుండు నుత్సాహుఁడై
భవుఁడే మంత్రిగ నుండ నర్హుఁడుః సలుం ♦ బ్రాకృష్ణసింహేంద్రువం
టి విశేషజ్ఞు గడింపఁగా నగునె! మా ♦ త్రిత్వంబు సంధింపఁగన్. 163

యనె లోకమ్మునఁ బుట్టు వొందిన యభా ♦ గ్యచ్ఛత్రసంపన్ను, నన్
ధనికున్ జేసి కృతార్థుఁ జేయఁ గరుణన్ ♦ దైవంబవై తోఁచితే! 1

ఉ॥ ధనము నొసంగి, వస్త్రము ♦ దాయ మొసంగి, యనర్ఘరత్నమం
డనము నొసంగి, బ్రాహ్మణుల ♦ నా రవివంశజులెల్లఁ దొల్లి య
ర్చన మొనరించుచుండ్రు; రది ♦ సవ్యము; భూసురమౌళివైన నీ
ధన మిపు డేను వైకొనుట ♦ ధర్మమ్ము గాదని తోఁచె నామదిన్." 1

క॥ అని జంకుచు సంకోచించిన భామాసాహి "మిమ్ము ♦ సేవించి గడిం
చిన ధన మీతఱి మీకప్పన మొనరించుటయ పరమ ♦ భాగ్యము నాకున్. 1

క॥ మేవాడదేశ ధనమే మావాడల నుండు; దాని ♦ మాతృపద శ్రీ
సేవావిధి కర్పింపని జీవన మేమిటికి! వట్టి ♦ సిరి యేమిటికిన్! 1

క॥ మనసార నిత్తుఁ జేకొను; వినుము కలిగినపుడు మఱల ♦ వృద్ధియు మూలం
బు నొసంగుము కొనెదను; వలదనకుము; నామాట చూడు; ♦ మగును శుభంబుల్

మ॥ తడవున్ జేయక బోయపాళెమునకున్ ♦ ద్రవ్యంబు నంపింతు! న
క్కడకున్ మీరును బోయి యాశబరలో ♦ కస్వామి దర్శించి యె
క్కుడుగా సేనలఁ జేర్చుకొం; డిచట నా ♦ కున్ నిల్వఁగాఁ దీర; ది
ప్పుడె నేఁ బోవుదు"నంచు లేచి తురగం ♦ బున్ డాసి పైనెక్కుచున్, 1

—*) భామాసాహి రాజపుత్రులకు దేశభక్తి నెఱిఁగించి పురికొలుపుట. (*—

సీ॥ "సిరికిఁ దానకమైన ♦ చిత్తూరు పురలక్ష్మి యనదయై పాడఱి ♦ వనట మునుఁగ,
నుర్వియంతయు మెచ్చు ♦ నుదయపురవిభూతి బూదిపాలగు హోమ ♦ మగుచు నెడఁగ
గోటల కన్నిఁట ♦ మేటి 'కుంభల్‌మియర్' యవనుల చేఁబడి ♦ నవసిపోవఁ,
బావనోన్నతమేఘ ♦ భవనంబు తురకమొక్కెముల గాడ్పులు సోఁకి ♦ కీడువడఁగ,
తే॥ నట్టి హారావళీపర్వ ♦ తాంతరముల నిరువదేం డ్లని చేయు పెం ♦ పెల్లఁ బొలియఁ,
గడుపుఁగూటికై వంశవి ♦ క్రమము మఱచి వెడలుచున్నారె! మేవాడ ♦ వీరులార! 17

సీ॥ శార్దూలరాజభు ♦ జాపీఠి స్వారి చేయఁగఁజాలు ఝూలాభ ♦ టాళు లుండ,
బాలురై రిపుసమ ♦ వర్తులై ఖండించు ప్రబలచోండావన్య ♦ పాలు రుండ,
విమతరాష్ట్రర్భని ♦ ర్భేదకప్రౌఢి దీపించు రాఠోడ్కుల ♦ వీరు లుండ,
ముజ్జగంబులనైన ♦ ముంజేతఁ బోఁద్రోయఁ గలిగిన చోహాణ ♦ బలములుండ,

గీ॥ మాపరితాపుఁడు బ్రిదికి సే♦మమున నుండఁ గృష్ణసింహు నొడల నూపి♦రెసఁగియుండఁ,
73 గులసనాతనవీర్యంబుఁ ♦ గుంటఁ బెట్టి పాఱుచున్నారె! మేవాడ ♦ వీరులార! 179

సీ॥ రాజ్యంబు పోయినఁ, ♦ బ్రాభవం బూడిన, సకల భాగ్యంబులు ♦ సన్నమైన
బలమెల్లఁ జెడినఁ, గో♦టలు పోయినను, సారె కపజయంబులు క్రమ్మి♦యడలొదవిన,
గడ్డి యాహారమ్మ ♦ గాఁ జెట్లనీడలు నెలవుగా మృగములై ♦ స్నేహితులుగ
74 నిల్లాలి నెడఁబాసి ♦ పిల్లల విడనాడి కట్టుగుడ్డలు లేక ♦ గాసి పడియు

గీ॥ విడక స్వాతంత్ర్యమును గొల్చు ♦వీరుల నెడి యశముఁ బోఁద్రోసి యాభిజా♦త్యంబు రోసి
75 కటకటా! దేశ మరుల క♦ ర్గంబు చేసి విడుచుచున్నారె! మేవాడ ♦ వీరులార! 180

సీ॥ తెఱవల విమలపా ♦ తివ్రత్యమహిమంబు సన్నిగిల్లినఁ గనుల్ ♦ చల్లనయ్యెనొ!
76 సకలదిగ్దేశ రా ♦ జన్యపరితాపాగ్ని చల్లార హృదయముల్ ♦ శాంతిఁగనెనొ!
భరతఖండమున గో ♦ వధలు సాఁగినఁ జూచి యాతరాత్మను సౌఖ్య ♦ మలవడియెనొ!
. దాస్యాంధకారంబు ♦ దశదిశల్ గవియ దేహముల నాప్యాయనం ♦ బలముకొనెనొ!

గీ॥ కనులు తిరిగినొ! బాహువి♦క్రాంతి చెడెనొ! బుద్ధి శతిఁగెనొ! చెడు వేళ♦ముసురుకొనెనొ!
కానిచో మాతృదేశంబు ♦ మాని పోవు వెఱ్ఱి యెటు గల్గె మేవాడ ♦ వీరులార! 181

సీ॥ యవనగజేంద్రసిం ♦ హఖ్యాతిఁ గాంచిన బప్పరాయనిఁ గన్న ♦ భవ్యమాత!
77 జీవితం బరికోటిఁ ♦ జెండ నర్పించు హమీరసింహుని గన్న ♦ మేటితల్లి!
భానువంశక్షమా ♦ పతిమౌళి యన నొప్పు సమరసింహుని గన్న ♦ చల్లనమ్మ!
యతిదీక్షతో మొగల్ ♦ యాగముఁ దీర్చు సంగ్రామసింహునిఁ గన్న ♦ రాజజనని!

గీ॥ యందఱను మిమ్ముఁ బెంచిన ♦ యసమధాత్రి! తల్లి దండ్రియు గురువునై ♦ తనరుసీమ!
(, యకటకట! స్వర్గమునకన్న ♦ నధికమైన మాతృదేశంబు విడరాదు ♦ మఱలరయ్య! 182

సీ॥ కడుపుకక్కురితి కీ ♦ గతిఁ జేయఁగారాదు; తినినఁ దినకయున్నఁ ♦ జనును గాల;
మక్కటా! ప్రాణంబు ♦ లంత తీపైయున్నె! పిఱికి పందలటన్న ♦ పేరు రాదె!
78 బవరం బనిన నొడల్ ♦ వడఁకెనే మీకు! భార్యాపుత్రులం దంత ♦ యాస తగునె!
చిరకాల మపకీర్తి ♦ చేరదే! హృదయాభిమానధనంబెల్ల ♦ మాసి పోదె!

గీ॥ తగదు పయనింప! వెనుకకుఁ ♦ దరలరయ్య! బలముఁ గొనరయ్య! కోటలు♦గెలువరయ్య!
యరుగవలె నాకు సెలవియ్య ♦ రయ్య;" యనుచు నశ్వమును ద్రిప్పి వెనుకకు ♦ నరుగఁ
బోడఁగె. 183

గీ॥ వినిసి వినితేనె వాఁక జొ ♦ బ్బిలినయట్లు, వీరరసము పొంగి పొరల ♦ వీరులెల్ల
వెడలిపోవుచునున్న యా ♦ విప్రుచరణ సరసిజములకు మ్రొక్కి యు♦శ్వముల నెక్కి, 18

—*) రాజపుత్రులు వెనుదిరిగి భీమచాందు నివాసమునకు వచ్చుట. (*—

మ॥ త్వరమై నద్దమరేయికిన్ జని కీరా ♦ తస్వామి గూడెంబులన్
దరియన్ బోయి బహిఃప్రదేశముకడన్ ♦ ధాత్రీనభోభాగముల్
విరియన్ శంఖము లూఁది; రంత శబరో ♦ ర్వీనాథుఁడున్ మిత్రశం
ఖరవంబుల్ గుఱుతించి స్వాగత మిడం ♦ గా వచ్చె సాశ్చర్యతన్. 18

గీ॥ రచ్చపట్టు మ్రోల మహాగ్ని ♦ రగులఁజేసి పిలపిలని మూఁగి భిల్లులు ♦ బలిసి కొలువ
భీమచాం దందుఁజేరిన ♦ వీరులకును సాత్త్వికాహారము లొసంగి ♦ సత్కరించె. 18

తే॥ తెలతెలవాఱెను; భానుఁడు మొలిచెను బూర్వాద్రి; వీర ♦ పుంగవులు మహీం
తలపతి పదముల కెఱగుచు సెలవు గొనుచు వెడలి రాత్మ ♦ సీమలు చేరన్. 18

శా॥ "భామాసాహి ధరామరేంద్రుని కృపన్ ♦ స్వాతంత్ర్య దుర్వార సం
గ్రామక్రీడలు పెంచి శత్రుతతులన్ ♦ ఖండింపఁ గాంక్షించె; రా
రో! మీరందఱు దేశభక్తిపరిపూ ♦ ర్ణుల్ బాలురన్ వృద్ధు లు
ద్దామాటోపుఁ బ్రతాపుఁ గూడఁగఁ గిరా ♦ తస్వామి గూడెంబునన్." 18

చ॥ అనుచును రోదసీకుహర ♦ మంతయు వ్రీలెడుభంగి డిండిమ
స్వనముల రాజపుత్రకులు ♦ పల్లెలు పట్టణముల్ పురంబు ల
న్ని నగరముల్ గిరీంద్రము ల ♦ నేక గుహాకుహరమ్ములందునన్
వినఁబడఁ జాటఁజొచ్చి రొక ♦ వేయు విధంబుల దేశ మంతటన్. 18

—*) నలుదెసల నుండి రాజపుత్ర సైన్యములు వచ్చి ప్రతాపసింహుని జేరుట. (*—

సీ॥ అలసలుంబ్రావిభుం ♦ డహిత దుర్వార చోండావద్బలంబుతో ♦ నడచి వచ్చె;
బేడ్లా-కొఠేరియా ♦ పృథ్వినాయకులు చోహాణవర్గముల్ కొల్వ ♦ నరిగి రంత;
§ నానాపురా-బునే ♦ రాకీశులు శిశోదియాభటుల్ గొలువఁ బ్రి ♦ యాణ మైరి;
హరిదాసుఁడు ముకుందుఁ ♦ డరుదెంచిరి మహోగ్రరాఠోడుసుభటవ ♦ ర్గములు గొలువ;

§ The castle of Bunera is one of the most imposing feudal edifices of Mewar, ... of the greatest of its chieftains. He not only bears the title of ... all the state insignia attached thereto.

" Personal narrative "

గీ॥ శ్యామసింహుండు చనుదెంచె ♦ సాద్రినుండి; భిల్లురానుండి సూక్తుండు ♦ వెడలె; దేవ
గృహామునుండి దూడాసింహుఁ ♦ డేగుదెంచె: దుర్జయుఁడువచ్చెఁజోంజావ♦తులనుగూడి.

గీ॥ అంత నొకనాఁడు సేవకుం ♦ డరుగుదెంచి భిల్లపరివృతుఁడగు నృప ♦ తల్లజుఁగని
"స్వామి! మంత్రిభామాసాహి♦బండ్లు వచ్చి నిలిచెఁ, జాతురుగా"కంచుఁ♦బలికి కాలిచె.

గీ॥ భిల్లనృపతి ప్రతాపుఁడు ♦ వెడలి సాద్రివైపునను మూఁడు క్రోసుల ♦ పజకు సిలుచు
భటులు నాలుగువేలు, ద్ర ♦ వ్యంబు గలుగు బండ్లు వేయును గని హర్ష♦భరితుఁడై రి.

గీ॥ నెలకు నైదును-బదిరూ ప్య ♦ ముల కొలంది పదియు-రెండేండ్లదాఁక ని ♦ర్వహియునైదు
వేల భటులకు భృతినియ్యఁ ♦ జాలుననుచు భిల్లమణి రాజమణి లెక్క♦ వేసె రపుడు. 193

—*) ప్రతాపసింహుఁడు యుద్ధ సన్నద్ధుఁ డగుట. (*—

క॥ "కనఁబడె దివి నింద్రుశరాసన; మిది రణమునకు మంచి ♦ శకునం"బని భి
ల్లనృపాలుఁడనఁగ జనపతి యని కాయత్తం బొనర్చె ♦ యాత్మచమువులన్. 194

క॥ ఎలనవ్వు వెలయఁగా నర్మిలి బిడ్డల నక్కు చేర్చి ♦ మేను నిమిరి చు
చులు దువ్వి ముచ్చటల ముద్దులజడి గుఱియించెఁ గూర్మి ♦ నొంతర గట్టన్. 195

మ॥ పరమప్రేమమునన్ బ్రతాపవిభుఁడున్ ♦ ప్రాణేశ్వరిన్ జేరి "ము
ష్కర తౌరుష్క భటాళులన్ దఱిగి నే ♦ స్వాతంత్ర్య సంగ్రామమున్
జరపన్ గోరి ప్రయాణమైతి నిపుడే; ♦ సంపూర్ణచిత్తంబుతో
⊕ నరవిందేక్షణ! సమ్మతింపుము శుభ ♦ ప్రారంభ యాత్రారతిన్. 196

గీ॥ నీ సుధా స్వాను లజ్జా వి ♦ లాసరేఖ చిత్తమున హత్తి మెఱయుచు ♦ స్మృతికిఁదెచ్చు;
మనకుఁ గలయిక నెలకొక్క♦మాఱు గలుగుఁబరమసంతోషమున నన్నుఁ♦బంపుమిపుడు

గీ॥ నీవు బిడ్డలు గొన్నాళ్ళు ♦ నిలువుఁ డిందు; భిల్లు లేవేళ మిమ్ముఁ గ ♦ న్పెట్టియుంద్రు;
భీమచాంద్రుగా రిపుడు నా ♦ వెంట వత్తు"రనినఁ బాటేశ్వరిదేవి ♦ యాస్య మెత్తి; 198

---

⊕ Although I cordially unite with Segur, who is at issue with his compatriot Montesquieu on this part of discipline, yet from the knowledge I do possess of the freedom, the respect, the happiness, which Rajput women enjoy, I am by no means inclined to deplore their state as one of captivity.

" Religious Establishments."

—*) బాళేశ్వరీదేవి ప్రతాపసింహుని విజయ యాత్రకుఁ బంపుట. (*—

ఆ॥ స్మితకళామరీచి ♦ మీమోమునఁ దోఁచె; నింతికన్న భాగ్య ♦ మేమి నాకు!
శైలతలమునిండ ♦ సైన్యముల్ చెలఁరేగ, వెడలి విజయలక్ష్మి ♦ వెంటరండు.
గీ॥ సిద్ధసంకల్పభరితమౌ ♦ చిత్తమందు వలదు చోటీయ నాకుఁ బి ♦ ల్లలకు" నంచు
వెడఁదకనుల ముత్తెఁపుజాయ♦విరియఁ దుదలఁగప్పు ఱెప్పల నాసతోఁ♦గాంతుఁగని
సీ॥ విజయసూచకముగా ♦ భిల్లభటులు చుట్టు మూఁగుచుఁ గైవార ♦ ముల నొసర్ప,
బోయగుబ్బెతలు గుం ♦ పుగఁజేరి చిఱునగ వలరు మోములఁ బాడి ♦ యాడుచుం
బాళేశ్వరీదేవి ♦ వజ్రమ్ములు ప్రవాళములును మాణిక్యముల్ ♦ ముత్తియములు
హాటక పాత్రంబు ♦ లందుఁ గైకొని నిజేశ్వరునకు మేల్మి ని ♦ వాళి దీర్చి,
గీ॥ రాగ మలరఁ గప్పురపు హా♦రతు లొసంగి, నిరుపమామోదమున నెత్తి ♦ నీళ్లు దీసి
"జరుగుఁగావుతఁ గళ్యాణ♦జైత్రయాత్ర" యనుచు శ్రీపాదములు నుదు♦రంట మ్రొక్కి
సీ॥ "జంభదైత్యేంద్రుని ♦ సమయింప నరిగెడు నపుడు బిడౌజున ♦ కైన జయము,
ఖరదూషణాది ర ♦ క్షశ్శ్రేణిపై కేగు నపుడు శ్రీరామున ♦ కైన జయము,
నరకాసురునితో ర ♦ ణంబు సేయఁగఁ జను నపుడు శ్రీకృష్ణున ♦ కైన జయము,
కాలకేయాదులఁ ♦ గసిమసంగఁగఁ బోవు నపుడు కిరీటికి ♦ నైన జయము,
గీ॥ సకలశాత్రవజయము, శా♦శ్వతజయంబు, భువనజయమును, నిరుపమా♦మోదజయము
వెల యెఱుంగని జయమును,♦సులభజయము, జయముపై నీకు జయములు♦జరుగుఁగా
గీ॥ అమరసేనాధిపత్య ప ♦ ట్టాభిషేక మగుచుఁ గ్రౌంచాద్రి భేదింప ♦ నరుగు నపుడు
మా కుమారున కట్టులు ♦ నాకుమార! యమరసింహ! నీకగుత లో♦కైకజయము."
గీ॥ అనుచుఁ బాళేశ్వరీదేవి ♦ హస్తయుగము నెత్తి యభినందనము సేయ ♦ నృపగురుఁడు
నగవు మొలకెత్తు చూపుల♦మగువ సెలవు నంది యచ్చోటు విడిచె; సై♦న్యములు న
గీ॥ గూడెముల, నిండ్లకొప్పుల ♦ గొండపేటులందు, గండోపలములందు, ♦ నధివసించి
శబరసతులెల్లఁ బూలు లా ♦ జలును జల్లి రాప్రతాపునిపైన సై ♦ న్యములపైన.
క॥ ఈ కీర్తిఁ జైత్రయాత్రాప్రారంభము చేసి యర్ధ ♦ రాత్రమునకు ధా
❁ త్రీరమణుం డరిగెను దేవేకీమర్గము కవాట ♦ వీధిఁ జేరఁగ.

❁ The name of Bhamasah is preserved as the Saviour of Mewar. W
this splendid proof of gratitude and the servante of Prithwi Raj as incitements,
again "screwed his courage to the sticking place" collected his band and wh

